8 అణాలు



# సీతతో సినిమాకి



చందూరి నాగేశ్వరరావు

# హ్ృదయ

హృదయము, నరములు, కండర
ములయొక్క బలహీనతను పోగొట్టి
శారీరక, మానసిక శక్తులను పెంపొం
దించు గొప్ప బలవర్ధక రసాయనము.

త్రిపురసుందరీ ఔషధాలయం
ఏలూరు — భీమడోలు

# సీతతో సినిమాకి

*

చందూరి నాగేశ్వరరావు

*

ప్రతిమా బుక్స్
ఏలూరు







[ మొదటిదీ ఆఖరిదీ మినహా మిగతా
వన్నీ 'ఆలిండియారేడియో' నుంచి
[illegible] ...... ]







[ మొదటిదీ ఆఖరిదీ మినహా మిగతా
వన్నీ ఆలిండియారేడియో నుంచి
బ్రాడ్‌కాస్టు అయాయి.......... ]

## మిగతా పుస్తకాలు

* కాఫీ మానెయ్యడం
* ఎక్కడికి కమలా ?
* ఆఖరు కోరిక
* కొత్తలోకాలు

# కథ

సీత అల్లరిపిల్ల

"మామయ్యా'

"... ... ... ..

"మామయ్యా! మామయ్యా!"

"... ... ..."

"మామయ్యోయ్! పలకవేం, బెల్లంగడ్డ నోట్లో పెట్టుకున్నావా?"

"వోఁయ్"

"అమ్మయ్య! ఇప్పటికి వినిపించింది!"

"ఎందుకమ్మా ఆ హడావిడి?"

"నాకు కథ చెప్పాలి. చెప్తావా, చెప్పవా?"

"ఇప్పుడు కథేమిటమ్మా!"

"ఏం?"

"కథలు రాత్రిపూట చెప్పుకోవాలిగాని, పగలు కాదు."

"పగలవుతేనేం?"

"ఏమీ లేదు."

"అవుతే చెప్పు."

ఆ బాలతో వాదించలేక మామయ్య మొదలు పెట్టాడు.

"అనగా అనగా ఓ ఊళ్ళో ఓ రాజుండేవాడు. ఆ ఆ రాజుకి ఏడుగురు కొడుకులు..."

"ఏడుగురూ వేటకెళ్ళి ఏడు చేపలు తీసుకొచ్చారు..."

"నీకు తెలుసేమిటి ఆ కథ?"

"ఛీ. ఎప్పుడూ ఆ కథేనా? ఇంకోటి చెప్పు. నా కది అక్కర్లేదు."

"అనగా అనగా వో ఊళ్ళో..."

"ప్రతి కథా మొదలెట్టడానికి ముందర 'అనగా అనగా' అనడం ఎందుకు?"

"పెద్దవాళ్ళలా అంటూంటారు. అంచేత నేనూ అన్నా."

"అవుతే పెద్దవాళ్ళుచేసే పనులన్నీ మనం చెయ్యొచ్చా?"

"చెయ్యకూడదు. వాళ్ళు చెప్పినట్లు మనం చెయ్యాలి. వాళ్ళు చేసేటట్లుకాదు."

"అదేమిటి మామయ్యా? వాళ్ళకి చేతకాక మన్ని చెయ్యమంటారన్నమాట."

"కథమొదలెట్టగానే నీకిన్ని సందేహాలు వస్తుంటాయెందుచేత? కథవద్దా?"

"ఆ ఆ మర్చిపోయాను. చెప్పు."

"ఒక ఊళ్ళో వో ఈగవుంది."

"ఏం ఈగ?"

"మనం రోజూ చూస్తూండే ఈగ."

"కుక్కపిల్ల..."

"నీ ముహం. కుక్కపిల్లేమిటి?"

"అదికాదు, మామయ్యా! మన కుక్కపిల్ల సరిగ్గా అన్నంతినక మెతుకులు పారేస్తే చుట్టూ మూగుతాయి; అవేనా ఈగలు?"

"ఊఁ, ఆ ఈగ ఒకరోజున—"

"ఏ ఈగ?"

"మనంరోజూచూస్తుండేఈగల్లో ఒక ఈగ."

"కుక్కపిల్లదగ్గరుండే ఈగల్లో ఒకటేనా?"

"అవును. ఆఈగఒకరోజున యిల్లు... ..."

"కుక్క పిల్ల దగ్గరే నా ఈగలు వుండేది, మరింకెక్కడా వుండవ్!"

"వుండకేం?"

"ఎక్కడుంటాయ్?"

"జిలేబి, హల్వా మొదలైన తీపివస్తువులచుట్టూ మూగుతాయి."

"ఏం మామయ్యా! జిలేబి నీకు నచ్చుతుందా?"

"కథమాటమర్చిపోయావు."

"కథకేంగాని, నాకిప్పుడు జిలేబికావాలి."

"కథఅయిపోయిన తర్వాత కాఫీహోటల్‌కి పోయి తిందాం."

"ఇంకా ఎంతసేపటికి అవుతుంది కథ? నానోరూరుతోంది, త్వరగా అవనీ."

"నువ్వు పిచ్చిపిచ్చిప్రశ్నల్తో నన్ను బాధించకుండావుంటే శీఘ్రంగానే అయిపోతుంది."

"అవుతే త్వరగాకానీ."

"ఆ ఈగ ఒకరోజున ఇల్లుఅలుకుతూ——"

"ఏ ఈగ? ఇనుపటి ఈగేకాదూ?"

"...పేరు మర్చిపోయింది..."

"అమ్మ చేయించుకొన్న కాసులపేరు లాటిదేనా? అమ్మకూడా ఒకరోజున హాల్లో బల్లమీద పెట్టి మర్చిపోయింది."

"అలాటిదికాదు. మనుషులకుండే పేరు."

"ఏం.—అమ్మ మనిషికాదా?"

"అదికాదు, సీతా, నీపేరేమిటి?"

"నాపేరా.

"అవును. నీపేరే?"

"నాపేరా... ...నాపేరా..."

"అవును. పేరు చెప్పేటందుకంత సందేహిస్తా వేమిటి?"

"మామయ్యా, చిన్నపిల్లనిచేసి నాతో వేళాకోళాలాడ్తావెందుకు?"

"ఏమిటది?"

"నాకు పేరులేదని నీకు తెలీదూ? అమ్మ పెళ్ళయే వరకూ చేయించనని అంది. నాన్నగారి నడిగితే, యింకో పదేళ్లు పోయేవరకూ పెళ్లే చెయ్యనన్నారు,"

"నీమొహం. పిచ్చివాగుడూ, నువ్వూ నూ. పేరంటే అందరూ మన్నిపిలిచే పేరన్నమాట."

"... ... ... ... ... ..."

"చెప్పేది విను. ప్రతి మనిషికీ ఒక పేరు వుంటుంది."

"నాఖర్మం. నాకుమాత్రం లేదు."

"మొద్దూ, పూర్తిగా విను. నీపేరు సీత."

"ఆ సంగతి నువ్వుచెప్పేదేమిటి? మా నాన్న

గారు 'సీత' అని నేను పుట్టినప్పుడు బియ్యంలో వ్రాశారట, నిజమేనా ?"

"నిజమే !"

"ఎందుకు వ్రాయాలలా ?"

"మళ్లీ మొదటికొచ్చావ్. కథ మాట మర్చి పోయావు."

"జిలేబీల దగ్గరుండే ఈగ కథేనా ?"

"ఊఁ"

"ఈగకథ వద్దు. జిలేబిలు తిందాం రా."

"కథ అయిపోనీ."

"కథావద్దు, గిథావద్దు. ఇప్పుడే రావాలి. నా కడుపులో ఆకలి మండిపోతోంది"

"అన్నం తినలేదూ ?"

"తిన్నా. ఇది జిలేబీ ఆకలి."

"సీతా ! సీతా !!" అని లోపలనుంచి పిలుపు.

"అమ్మ కేకేస్తోంది, వెళ్లిరా."

"నిముషంలో వస్తా. కోటేసుకొని సిద్ధంగా వుండు. కాఫీహోటల్‌కిపోయి అరడజను జిలేబీలు తినాలి," అని అంటూ రివ్వున లోపలికి పరుగెత్తు తుంది సీత.

(జూలై 1936)

# సీతతో సినీమాకి

పిల్లలు ఎలాటి అవతవక ప్రశ్నలు వేసినా ఆ పిచ్చిప్రశ్నలకి సరి అయిన సమాధానాలు పెద్ద వారు చెప్పని పక్షంలో, పిల్లల జ్ఞానోదయానికి భంగం కలుగుతుందట. అలాన్కొక్క వక్కాణించే వారందరి వద్దకూ మా సీతని ఒక్కసారి పంపిస్తే సరి! ఆ పదేళ్ళబాలకి, సీతకి, ఈ ప్రపంచం అంతా అయోమయమ్మే! అన్నీ ??? అవును, కొశ్చన్ మార్కులే!

ఆమెకి అణువు మొదలు అండపిండ బ్రహ్మాండంవరకూ అన్నీ సందేహాలే! అన్నీ సంశయాలే! అన్నీ కొశ్చన్ మార్కులే!

పూర్వం జనకమహారాజు సీతని శివధనస్సు ఎక్కుపెట్ట గలిగిన రాముడికిచ్చి పెళ్ళి చేశాడట. అలాగే, మాసీతకి కూడా ఆమె సంశయపరంపరని నివృత్తి చెయ్యగల మహామహుడు భర్త అవుతే బావుండును! ఆమె ప్రశ్నలవర్షం ఖాండవవనం

దహిస్తున్నప్పుడు యింద్రుడు కురిపించిన రాళ్ళవాన కి యిసుమంతయినా తీసిపోదు.

సీతకి తరుచూ సముద్రంలో కెరటాలు ఎందుకు రావాలనీ, సూర్యుడు మా మేడకి ముందు వైపుని వుదయించి వెనక వైపుని అస్తమించడానికి బదులు వెనక వైపున వుదయించి ముందు వైపునే ఎందుకు అస్తమించకూడదనీ, కొంకాయలోకి నీళ్లు ఎలా వస్తాయనీ, అన్ని రకాల చాక్లెట్లలో ఏ రకం చాక్లెట్లు మంచివనీ మొదలుగాగల సంశయాలు కలుగుతూ వుంటాయి. ఆ లేత మెదడులో అన్ని వ్యరివృూహాలకి తావు ఎక్కడ వుందో!

ఒక రోజు మధ్యాహ్నం కాఫీలు నన్ను అడిగింది: "మామయ్యా, మా మేస్టరుగారు భూమి గుండ్రంగా వుందని చెప్పారు నిజమేనా?"

నా గుండె లటుక్కుమంది. చెప్పిన దేమో మేస్టరుగారు; నేర్చుకొన్న దేమో తను. మధ్యని నాకెందుకంటా ఈ తంటా?

"అవును."

"ఏమిటి అవును మామయ్యా?"

"ఈ భూమి గుండ్రంగానే వుంది."

"అదే, ఈ ప్రపంచం కోడిగుడ్డులా వుందం

టావు కాదూ? అన్నట్లు, మనం కోడిగుడ్డు తిన వచ్చునా, మాామయ్యా!"

"మనం బ్రాహ్మలం. తినకూడదు. తప్పు!"

"అవుతే క్లీడరుగారి అమ్మాయి మొందు అస్ చెప్తూ రోజూ పొద్దున్నే కోడిగుడ్డురసం పుచ్చు కుంటుందేం?"

"నీ కెందుకూ యింకోళ్ళ గొడవ?"

"అవున్లే నా కెందుకు ?.........భూమి గుండ్రగా వుందంటావు కాదూ?" అంటూ మొదటికి వచ్చింది.

"ఊ" అన్నట్లు తల పంకించాను.

"మరి, భూమి తిరుగుతోందంటారు. నిజ మేనా?"

"ఊ"

"అవుతే, మనం తిరగమేం?"

అక్కడితో పడింది బ్రేకు. భూమి తిరుగుతోం దని మా మేస్టరుగారూ చెప్పారు, నా చిన్నప్పుడు. భూమి సూర్యుని చుట్టూ తిరగడమే కాకుండా తనలో తను తిరుగుతోందని కూడా చెప్పారు. మనమెందుకు తిరగమని మేమూ అడిగాం, మా మేస్టార్ని. తిరగమని నమ్మకర్షగా, విస్సన చెప్పింది

లేదమన్నట్లుగా, చెప్పాడు. మాలో వున్న బడుద్ధాయి ఒకడు ఎందుకు తిరగమని గట్టిగా అడిగితే ఒక్క చురక తగిలించాడు. దెబ్బతో మా సందేహాలన్నీ దేవేంద్రలోకంలోకి పోయినై. Two parallel straight lines will never meet అన్న axiom లా భూమిగుండ్రంగా వున్నదన్న విషయం కూడా ఒక axiom అని మేము నమ్మవలసి వచ్చింది. నా బుర్ర బద్దలు చేసుకొన్నా, ఈ గొడవ అంతా సీతకి అర్థమవుతుందా!

“ఏం, మామయ్యా, మాట్లాడవ్?”

“ఏమిటి?”

“భూమి తిరుగుతోంది కదా మనమెందుకు తిరగం”?

“తిరగం.”

“ఏం.”

“ఏమీ లేదు.”

“ఎంచేత తిరగం?”

“ఏమీ లేదు.”

“అదేమిటి మామయ్యా, మా మేష్టారూ అలాగే చెప్పారు, నువ్వూ అలాగే చెప్తున్నావ్?”

మనం ఎందుకుతిరగమో సీతకి నచ్చేటట్లు చెప్పడం సులభసాధ్యం కాదు.

అలా అంటే నవ్వుతున్నారా ? సీతా నవ్వింది, ఫక్కున.

*   *   *

కిటికీ సందుల్లోనుంచి సూర్యరశ్మి నా టేబుల్ మీద కొద్దికొద్దిగా పడుతోంది. నావళ్లు పుడక పెడుతోంది కాని చాలా సీరియస్‌గా పెకవ్ కథల పుస్తకం చదువుతున్నాను.

ఎక్కాయెక్కిని సీత నా టేబుల్ మీదికివచ్చి కూచుంది. నా వళ్లు మండింది.

"మామయ్యా, చెమట పోసేలా చదువు తున్నావేం ?" అంటూ పరికిణాకొంగుతో నా నుదుటి మీద స్వేదబిందువుల్ని తుడిచింది. ఆ అసాధారణపు ఆదరణతో నాకు రావలసిన కోప మంతా మటుమాయమై పోయింది. చిన్న నవ్వు నవ్వాను.

"తర్వాత చదువుకోవచ్చులేన్నే, మామయ్యా!" అంటూ నాచేతిలోని పుస్తకం తీసుకొని తనవళ్లో పెట్టుకుంది.

"సీతా, నేను చదువుకుంటూ వుంటే ఎందుకు

పాడుచేశావ్ !" అంటూ ఆ పదేళ్ళ బాలనీ నా నావళ్ళోకి లాక్కొని, రెండు బుగ్గలూ మృదువుగా నలిపాను.

"నా బుగ్గలన్నీ కందిపోతున్నాయి," అని అంది. సీత రెండు చేతుల్తోనూ తన బుగ్గల్ని దాచుకొంది.

ఒక నిముషం అలా గడిచింది.

"సినిమాకి తీసుకు వెళ్తానన్నావ్ ! మర్చిపోయా వేమిటి?"

"లేదు. మర్చిపోలేదు. ఇంకా టైమవలేదు."

ఆ రోజు సీత పుట్టిన పండగ. అంచేత ఆమెని సినిమాకి తీసుకు వెళ్ళాలట !

ఎలాగయితేనేం, సినిమాకి వెళ్ళాం. హాలు జేరుకొనేటప్పటికి యింకా అయిదున్నర అయినా కాలేదు. బుకింగ్ ఆఫీసు అప్పటికి తెరవనే లేదు. రాబోయే ఫిల్ములోని ఫోటోలు చూస్తూ ఒక పావుగంట దాకా నుంచున్నాం. ఇంతలో బుకింగ్ తెరిచారు. పన్నెండేసి అణాలు వెచ్చించి రెండు టిక్కెట్లు కొన్నాను. హాలులో ప్రవేశించినాం.

బయట కొద్దికొద్దిగా చినుకులు పడుతున్నాయి. చల్లగాలి వీస్తోంది! సినిమా చుట్టూ వున్న పూల మొక్కలు కమ్మటి వాసనలు వెదజల్లుతున్నాయి.

అంతవరకూ హాలులోకి వచ్చీపోయే జనసమ ర్దాన్ని పరికిస్తున్న సీత తన దృష్టుల్ని తలవని తలంపుగా పైభాగానికి ప్రసరింప జేసింది.

పంకా తిరగడం లేదు. ఎందుకు తిరక్క పోవాలి ???

వచ్చింది మీమాంస ; ఇచ్చింది పంకా తిర గడం లేదన్న వార్త నా..

"చల్లగా గాలి వేస్తోంది కదా, సీతా, యింకా పంకా ఎందుకు ?" అంటూ ఈ మామయ్య సీతని సమాధానపరచడానికి ప్రయత్నించాను. సాధ్యమా ?

"మనం రూపాయిన్నర యిచ్చాం. పంకా ఎందుకు తిరక్కపోవాలి ??? మనం యిక్కడ కూచున్నంతసేపూ తిరగ వలసిందే," అని ఆమె వితండ వాదన. –

దగ్గర్లో కూచున్న వారిలో తెలుగు వచ్చిన వారు మాసీతాదేవి భావిభారత దేశానికి ఆదర్శ స్త్రీరత్నమవుతుందన్నట్లుగా ఆమె వంక పరకా యించి చూసి తమలో తాము ముసిముసి నవ్వులు నవ్వుకొన్నారు.

నేను గేటువద్ద వున్న మనిషిని సమీపించి పంకా వెయ్యమని ప్రార్థించాను,

"అరు అవనియ్యండి సార్ !" అని అన్నాడు, ఆ అపరిచిత వ్యక్తి.

"నేను అయిదున్నరకే డబ్బిచ్చానే !"

అతను వులిక్కిపడి నన్ను ఎగాదిగా చూసి పక్కనివున్న స్విచ్ నొక్కాడు. పంకా గిర్రు మంటూ తిరగడం మొదలెట్టింది. సీత మొహం చింపి చేటంత అయింది.

మొదటి బెల్ కొట్టారు. సీత పరిశోధనా భావంతో నలుదిక్కులూ చూసింది.

"ఏమిటి ?" అని ప్రశ్నించాను.

"చాక్ లెట్లు."

అంత వరకూ ఎక్కడ దాగాడో గాని అమాంతం ప్రత్యక్షమయాడు చాక్ లెట్ల కుర్రాడొకడు.

"తీసికో, అమ్మా!" అంటూ కుర్రాడు పళ్ళాన్ని సీత ముందు పెట్టాడు. రకానికి మూడు చొప్పున సీత తీసికొంది. పన్నెకాల్ రూపాయి తీసుకు పోయాడు చాక్ లెట్ల వెధవ.

"అన్ని తీసుకొన్నావేం !" అని అన్నాను, సీతతో.

"తీసుకుంటున్నప్పుడు వద్దనక పోయావూ. కాగితం విప్పేశాను కూడాను."

"... ... ... ..."

"ఆ కుర్రాడు తీసుకుంటాడేమో! పిల్చి, కొన్ని యిచ్చేసెయ్యి.," అంటూ నా వంక వోరకంట చూసింది.

నాలో నేను నవ్వుకొన్నాను. ఆమె యిచ్చేది లేదు; వాడు తీసికొనేది లేదు.

సినిమా మొదలుపెట్టారు. సీతకి దాహమయింది.

వింటో కావాలంది. నోటిదగ్గర పెట్టుకొని బావుండ లేదని తోసేసింది.

టీ కావాలంది. టీలో పంచదార తక్కువయింది; రుచిగా లేదుకనుక తాగ లేనంది.

మంచినీళ్ళు కావాలంది. సోడా అమ్మేకుర్రాడ్ని బతిమాలి, వాడికి ఒకఅర్ధణా దక్షిణయిచ్చి, మంచినీళ్ళు తెచ్చి పెట్టమన్నాను. మంచినీళ్లు తాగింది.

శాంతా ఆప్టే ఒక పాట పాడుతోంది. గానప్రతిభఅంతా ఆ పాటలో వుట్టిపడుతోంది. ఆమె కంఠమాధుర్యం ప్రేక్షకుల్ని తన్మయులయేటట్టు చేస్తోంది. కాని సీతకి సినిమా అంతో ఏమిటోలా వుంది.

ఇంతలో ఇంటర్ వెల్.

మళ్లీ చాక్ లెట్ల కుర్రాడు నవ్వుతూ మా దగ్గిరికి వచ్చాడు. సీత స్వభావం పసిగట్టాడు కాబోలు!

"ఈ తఫా నువ్వే కొను మామయ్యా!" అని అంది సీత, చిరునవ్వు పెదవులమీద తొణికాడుతూ వుండగా.

నేను తెల్లబోయి, "అన్ని చాక్ లెట్లూ తినేశావా?" అని అడిగాను

"ఊఁ" అన్నట్లు ఆమె తల వూపింది.

"ఇంక చాక్ లెట్లు వద్దు. జబ్బు చేస్తుంది."

"చాక్ లెట్లు జబ్బు చెయ్యవ్. బలమని చెప్పలేదూ, మన డాక్టరుగారు?"

"అయినా, వద్దు."

"ఇవ్వాళ నా పుట్టిన పండగ కాదూ, మామయ్యా?"

"అవుతే?"

"నేను తినగలిగినన్ని చాక్ లెట్లు నువ్వు కొనాలి."

కొనవని నిష్కర్షగా చెప్పాను. రెండు నిమిషాలు గడిచినై.

"మామయ్యా, నాకు ఒక పావలా బదులు

యిస్తావా ? ఇంటికి వెళ్ళిన తర్వాత అమ్మని అడిగి యిచ్చేస్తాను.''

''ఎందుకు ?''

''కావాలి.''

''ఎందుకో చెప్పు.''

''ఇస్తానంటే చెప్తాను.''

''ఇస్తాను, చెప్పు.''

''చాక్ లెట్లు కొనుక్కోవాలి.''

నాకు నవ్వూ కోపమూ ఒక్కసారి వచ్చినై. ఇంకో పావలా తగలేసి చాక్ లెట్లు కొని సీతకి యిచ్చాను.

మళ్ళీ సినీమా మొదలెట్టారు. ప్రకటనలు చూపిస్తున్నారు.

అమృతాంజనం ప్రకటన చూసి, సీత అడిగిందదేమిటని.

ఫలానా అన్నాను.

''ఈ సినీమా నేను చూడలేను. నాకు తల కాయ నొప్పి వస్తోంది, మామయ్యా.''

''ఇలా పడుకో,'' అంటూ, తొడమీద తల పెట్టుకొని పడుకోమన్నాను.

''నేను అలా పడుకోను. ఇంటికి పోదాం.''

"సినిమా అయిపోయిన తర్వాత పోదాం. అంత దాకా యిలా పడుకో."

"కాదు. ఇప్పుడే పోవాలి. నాకు తల భారంగా వుంది."

"నీ మొహం."

"నాకు తల పోటుగా వుంది."

"నీ తలకాయ"

"అవును, నా తలకాయే నొప్పిగా వుంది. ఇంటికి పోయి, అమృతాంజనం రాసుకోవాలి."

సీత ఎంత చెప్పినా వినలేదు. ప్రకటనలు చూపించడం కాకపూర్వమే యింటికి ప్రయాణం కట్టింది.

"సినిమా పూర్తిగా చూడకుండా వెళ్ళడమేమిటి?" అని అన్నాను, నాకు బయలుదేరడం యిష్టం లేక.

"ఎందుకు పూర్తిగా చూడాలి?" ? ? ? ?

చెప్పండి బాబూ ఎందుకు చూడాలో !!!

* * *

ఇంటికి వస్తూ వస్తూ సీతని అడిగాను, 'సినిమా ఎలావుందని.'

సినిమాకంటె చాక్లెట్లే బావున్నాయంది.

(జూలై 1987)

# పేపరు

శాంతకుమారి ఏడేళ్ళ ముద్దుబాల. ఆమెచేసే చేష్టలూ, పలికే పలుకులూ, నడిచే నడకలూ హృదయానందాన్ని కలిగిస్తాయి. ఆ చేష్టలలోనూ, ఆ పలుకులలోనూ, ఆ నడకలలోనూ ఒక చిలిపి తనమూ, విజ్ఞానహేతువు అయిన ఒకమాదిరి అజ్ఞానమూ, విస్పష్టంగా ద్యోతకమవుతూవుంటాయి,

శాంత నా మేనకోడలు.

నేను హాలులోని వాలుకుర్చీలో కూచుని, పేపరు చేతిలో పుచ్చుకొని అబీసినియా ఆక్రమణ సంపూర్తిగా అయిపోయిన తర్వాత, ముస్సోలీనికి నూతనంగా కావలసివచ్చిన కాలనీల విషయమై చదువుతున్నాను. యూరపునంతా బెదిరిస్తున్న యిద్దరు డిక్టేటర్లలోనూ, ఒకడైన ఈ ముస్సొలీని మహాశయుడి గురించి దీర్ఘంగా ఆలోచిస్తూ అతను కోరుతున్న కాలనీల చారిత్రక విషయాలు తెలుసుకొందామనే కుతూహలంవల్ల అమితాసక్తితో పేపరు చదువుకుంటున్నాను. పానకంలో పుడకలా ప్రత్యక్షమయింది శాంత.

"మామయ్యా!"

"ఊ"

వినిపించలేదు కాబోలు మళ్లీ రెట్టించింది.
"మామయ్యా" అంటూ.

"ఊ" అన్నాను, ఓపికతో.

"మామయ్యోయ్!"

ఏమిటీ ఆర్భాటమన్నట్లు, మొహాసికష్టంగా ఉన్న పేపరుకొద్దిగా తొలిగించి, ఆమె నవ్వు మొహంవంక తీక్ష్ణంగా చూశాను. అలాచూడ డంలో నాఉద్దేశం: "నేను పేపరుఎంతో జాగ్ర త్తగా చదువుకుంటున్నాను. ఇవన్నీ జాతీయ అంత ర్జాతీయ విశేషాలు. నీకు అక్కర్లేనివి; నాకు అవ సరమయినవి. నన్ను శ్రమపెట్టక నీదారిని నువ్వుపో. నన్ను ముస్సులోనిగురించి నరిగాస్టడీచెయ్యనియ్య."

నాతీక్ష్ణవీక్షణంలో యింత ఉద్దేశంఉన్నా, ఆమె చాలతేలికగా, "ఓయ్, మామయ్యోయ్!" అంది, జొన్నగింజలలాంటి పలువరుసా, సొట్టలు పడుతున్న చెక్కిళ్లూ, ఆమె సోయగాన్ని ద్విగుణీ కృతం చేస్తూవుండగా.

నాకూ, ప్రపంచానికీ యిలాంటి సందర్భాల లోనే పేచీవస్తుంది. ఏవిషయాన్ని అయితే నేను

ఎంతో సీరియస్‌గా తీసుకుంటానో, ఆవిషయాన్నే ప్రపంచం అంత చులకనగా చూస్తుంది.

"ఏం శాంతా!"

"ఏం చదువుతున్నావ్!"

ఏం చదువుతే తన కెందుకో?—తన కేమన్నా బోధపడుతుందా, ఏమన్నుందా?

"చూడడం లేదూ?"

"చూస్తున్నాను, నాకు కళ్ళు ఉన్నాయి," అంటూ కళ్ళు మిటకరించింది.

ఆ మిటకరింపు చూసి నేను అప్రయత్నంగా చిరునవ్వు నవ్వాను.

"పేపరు...కనిపించడం లేదూ?"

"కనిపించకపోవడానికి నల్లపూసా? నాలుగు తావులంత ఉన్న పేపరు నాకు కనిపించక పోవడ మేమిటి! చత్వారం ఉన్నవాళ్ళకి కూడా కని పిస్తుంది!"

నాలుగు తావులంత ఉంది పేపరు! చత్వారం ఉన్నవాళ్ళకికూడా కనిపిస్తుంది!!

అంతవరకూ నుంచునివున్న శాంత ఒక పేము కుర్చీ నా వాలుకుర్చీకి పక్కగా లాక్కుని కూచుంది. రెండు నిముషాలపాటు ఏదో ఆలోచిస్తున్నదానిలా

నాలుగు గోడలూ పరిశీలించింది. ఇక నా చదువుకి అడ్డం తగలదు కదా అని నేను సంబరపడ్డాను. క్షణకాలంలోనే ఆశ నిరాశ అయిపోయింది.

"పేపర్లో... ఏం ఉంటాయి మామయ్యా?"

ఏం ఉంటాయని చెప్పేది! ఏం ఉంటాయని చెప్తే ఆమెకి అర్థమవుతుంది! ఏమీతోచక నిశ్శబ్దదేవత శరణుజొచ్చాను. కాని ఆమె ఊరుకుంటేనా?....

"అమ్మ రెండుపూట్లా కాఫీ ఎలామానలేదో, నేను బడికి వెళ్ళి బలపాలఆట ఆడడం ఎలా మానలేనో, అలాగే పేపరు చదవడంకూడా నువ్వు మానలేవు. జిలేబీ తింటే కడుపు నిండుతుంది. సినిమాకివెళ్తే బొమ్మలు చూడవచ్చు. కాని, పేపర్లో ఏం ఉంటాయి మామయ్యా?"

"అన్నీ ఉంటాయి."

"అన్నీ అంటే?"

"అన్నీనూ."

"అదిగో... ..."

"పేపర్లో ఎన్నో విశేషాలు ఉంటాయి."

"విశేషాలు అంటే?"

"సంగతులు."

"అవుతే, పేపరు నన్ను ఒకమారు చూడనీ."

నా చేతిలోని పేపరు తీసుకొని తలకిందుగా పుచ్చుకొంది. నేను చిన్నగా లోపల నవ్వుకొన్నాను. పైకి నవ్వితే చాలా హంగామా చేస్తుంది శాంత.

న్యూస్ పేపరులోని పేజీలు ఒక్కొక్కటే తిరగేస్తోంది. ఫొటోలు ఉన్న పేజీ పరిశీలిస్తోంది.

"ఈ ఫొటోల్లో ఉన్న మనుషులు తలకిందుగా ఉన్నారేమిటి?"

"నువ్వు పేపరు తలకిందుగా పుచ్చుకొన్నావ్!"

"మరి, యిందాకట్నించీ చెప్పచేం, నన్ను ఎగతాళి చేసేందుకా?"

చిన్నబుచ్చుకొన్న మొహంతో పేపరు సక్రమంగా పుచ్చుకొంది శాంత.

'నూతన దంపతులు' చూసి, "ఈదొర, దొరసాని ఎవరుమామయ్యా?" అని ప్రశ్నించింది శాంత.

"వారికి ఈమధ్యనే సిమ్లాలో పెళ్ళి అయింది.

"పెళ్ళిఅయిన ప్రతివాళ్ళఫొటోలూ యిందులో ఉంటాయన్న మాట!"

"గొప్పవాళ్ళింట్లో పెళ్ళిళ్లు అయితే, ఆ పెళ్లికొడుకూ పెళ్ళికూతురూ కలిసి తీయించుకొన్న ఫొటో యిందులో వేస్తారు."

"నీకు పెళ్ళిఅయినప్పుడు నీ ఫొటో యిందులో వేశారా?"

"లేదు"

"జానకిఅక్కయ్య ఫొటో, బావఫొటో వేశారా?"

"లేదు."

"మనం మోటారుకారుకూడా కొనుక్కున్నాం. మనం గొప్పవాళ్ళం కామా?

"గొప్పవాళ్ళమే! మనకంటె గొప్పవాళ్ళున్నారు"

"ఎవరు?"

"మనకి ఒక మోటారుకారు ఉంది. నాలుగు మోటారుకార్లు ఉన్నవారు మనకంటె గొప్పవాళ్ళు కారూ?"

ఏదో కొత్తసంగతి తెలుసుకొన్న దానివలె, వేళ్ళుమడిచి లెక్కపెట్టుకుంటూ, "అవును, మామయ్యోయ్, అవును. ఒకటికంటె నాలుగు పెద్దది ఒకటికి మూడు కలుపుతే నాలుగు అవుతుంది."

గణితశాస్త్రంలో ఆమెకి ఉన్న ప్రవేశానికి నేను తృప్తిపడ్డాను.

"నేను పేపరు చదువుకుంటాను. నువ్వుపోయి సీతంపిన్నిగారి లక్ష్మితో ఆటలాడుకో."

"ఎండలో ఆటలాడుతే అమ్మ చావగొడుతుంది."

"నీడలో ఆడుకో."

"అయినా ఎప్పుడూ ఆటలేనా బాబూ! కాసేపు పేపరు చదువుకోనీ," అంటూ చిలిపితనంగా నావంక చూసింది. ఆముద్దుపలుకులకి నాకు తలవని తలంపుగా ఫక్కున నవ్వొచ్చింది.

శాంత పేజీలు తిరగేస్తోంది.

చిట్టచివరకి ఆమెదృష్టి ముస్సోలినీ ఫొటోమీద పడింది. కొద్దిసేపు నిశ్చలంగా ఆ నియంతబొమ్మని పరకాయించిచూసింది.

"ఇతనెవరు, మామయ్యా?"

"ముస్సోలిని."

"మునలమ్మేమిటి?"

"ము ... స్సో ... లో ... ని."

"ముస్సోలిని. ఇతనేంచేస్తూ వుంటాడు. మా వ్యూరుట్ మేష్టారిడ్రస్ వేసుకొన్నాడు."

"ఇతను ఇటలీదేశానికి డిక్టేటర్."

"డిక్టేషన్ మేష్టారా! డిక్టేషన్ చెప్తాడా?"

"డిక్టేషన్ మేష్టారుకాదు. డిక్టేటర్."

"అంటే?"

"నియంత."

"నియంత అంటే?

"డిక్టేటర్."

"డిక్టేటర్ అంటే?"

"నియంత."

"ఇదేమిటి? ఇది అంటే అది అంటావ్. అది అంటే యిది అంటావ్?"

"అవును, అంతే."

"అంతే?"

"ఊఁ, అంతే!"

"ఇదెక్కడి పేపరు బాబూ, ఏటూ అర్థమవడం లేదు. అంతాగొడవగాఉంది," అంటూ పేపరు నా మొహాన పారేసి, తుర్రున తేనెటీగలా యింట్లోకి దూరింది.

పేపరునలిపి, చింపి, ముక్కముక్కలుగాచేసేసి వేస్టుపేపరు బాస్కెట్‌కి వప్పగించకుండా, నాకు సమర్పించినందుకు వెయ్యిదేవుళ్ళకి మొక్కాను.

(జనవరి 1958)

# పుట్టిన పండుగ

పేరేమిటని ఆ అమ్మాయిని అడిగితే 'శేష మాంబ' అంటుంది. పూర్తి పేరు చెప్పమంటే యింటి పేరుతోసహా 'వేంకట కనక దుర్గ లక్ష్మి సరస్వతీ శేషమాంబ' అంటుంది. కాని, అందరూ శేషూ అని పిలుస్తారు.

నేను నండూ మలుపు తిరిగేటప్పటికి వీధి అరుగు మీద నుంచుని దిక్కులు చూస్తున్న వేంకట కనక దుర్గ లక్ష్మి సరస్వతీ శేషమాంబ కనిపించింది. చేపల్లాంటి ఆమె కళ్లు (ఆమె వింటే వూరుకోదు; 'నా కళ్లని చేపలతోనూ గోడిగుడ్లతోనూ పోలుస్తావా ?' అంటూ కలహానికి సిద్ధమవుతుంది.) దేనికో అన్వేషిస్తున్నాయి. ఆత్రుత ఆమె ముఖ మండలంలో ముద్ర వేసినట్లు అగుపిస్తోంది.

నన్ను గమనించగానే ఆమె మొహం విప్పారింది. "మామయ్యా, ఎక్కడికి వెళ్తున్నావ్ ?" అంది.

'అదిగో! ఆ ప్రశ్న వెయ్యవద్దని నీకు ఎన్నో సార్లు చెప్పాను. పెద్దవాళ్లని 'ఎక్కడికి వెళ్తున్నావ్?' అని ఎప్పుడూ అడక్కూడదు."

"సరే సరే...నువ్వు ఎక్కడికి వెళ్తే నాకెందుకు గాని, పీచు మిఠాయి అబ్బాయి నీ కెక్కడయినా కనిపించాడా?"

లేదంటూ ముందుకి నడుస్తున్నాను, పీచుమిఠాయిల అబ్బాయిలూ మరమరాల అమ్మాయిలూ నాకెందుకు కనిపిస్తారూ!!

"మామయ్యోయ్, యివ్వాళ పీచుమిఠాయి అబ్బాయి రాలేదు సుమా!"

నాకు కాస్త ఆశ్చర్యం కలిగింది.

"పాపం! ఎంచేత రాలేదో! రోజూ రెండు గంటలయ్యేటప్పటికి విధిగా వచ్చేవాడు. ఇవ్వాళ, నాలుగయినా, యింకా రాలేదు, మామయ్యా!"

మెయిల్ ఆలస్యం అయినరోజున పత్రికల ఏజంటు కూడా అంత బాధపడడు.

"ఏం, వాడికోసం అంత బెంగపెట్టుకున్నావ్!" అన్నాను, నడివీధిలో ఆగి.

"పాపం! ఏమయిపోయాడో, ఏమయినా జబ్బు చేసిందో ఏమో అతనికి" అంది చిన్నారి శేషు.

"ఏమీ అవదు. ఏమీ జబ్బుచేసి వుండదు."

"నిజంగానా?" అంది.

నేను ఆవేదనగానీ, బాధగానీ యింకోరు అనుభవిస్తూ వుంటే, చూస్తూ, నాకేం సంబంధం లేనట్టుగా ప్రవర్తించలేను. వారికేదో నివారణోపాయం సూచించాలనీ, వారి బాధతగ్గించేందుకు ప్రయత్నం చేయాలనీ నా స్వభావం వుబలాటపడుతుంది. ముఖ్యంగా, చిన్నపిల్లలలోని చిన్నతనపు ఆవేదనలు నా జాలిగుండెలో మరీ హత్తుకు పోతాయి. పెద్దవారికి ఆవేదనలు ఎంత తగ్గించుకుందామనుకున్నా, కొద్దో గొప్పో వుంటూనే వుంటాయి. అధవా పిన్నవారయినా ఎట్టి ఆవేదనలూ లేక ఖులాసాగా కిలకిల లాడుతూ, చిలకలలా ఎగురుతూ, జింకలలా గంతులేస్తూ కాలం గడపాలని నా కోరిక.

రెండూ అడుగులు వెనక్కివేసి నష్టవర్షప్రాయ అయిన శేషు తల నిమురుతూ, "ఎందుకమ్మా శేషూ వాడికోసం అలా చూస్తావ్! నీ కేమయినా తినాలని వుంటే కాఫీహోటల్కి వెళ్దాం రా," అన్నాను.

ఒక్కమారు ఆమె ముఖంలో ఉత్సాహ దేవత ఎన్నో భంగిమలలో నృత్యం నలిపింది.

"అమ్మ ఏమయినా అంటుందేమో! వచ్చిన తర్వాత కొడితే... ..."

దూరదృష్టికి మెచ్చుకుంటూ, "కొట్టదులే,— నేను చెప్తాను కాదూ," అన్నాను.

ఇద్దరమూ కబుర్లు చెప్పుకుంటూ నడవడం మొదలెట్టాం దారిలో అంది శేషు: "మామయ్యా, ఇవ్వాళ మాయింట్లో ఒక గమ్మత్తు చేసుకున్నాం. ఏమిటో చెప్పకో?'

"తినేందుకు పెట్టనిదే నాకెలా తెలుస్తుంది?"

"ఇంతేనా మరి! అన్ని పుస్తకాలు చదువు తావ్—ఈ మాత్రం చెప్పకోలేవు?"

"ఊహు."

"నేను చెప్పనా?"

"ఊఁ."

"మైసూర్ పాక్. రేపు నాన్న పుట్టిన పండగ. అంచేత అమ్మ తయారు చేసింది."

"నువ్వు తిన్నావా?"

"ఊఁ."

"అయితే, యిప్పుడు కాఫీహోటల్లో మళ్లీ జిలేబీలు తింటే జబ్బు చెయ్యదూ?"

శేషు చక్కగా తప్పుకుంది.

"అమ్మ నాకు రుచి చూడ్డానికే పెట్టింది. తినేందుకు పెట్టలేదు. తినేందుక్కూడా పెట్టమని అడిగితే తిట్టింది. పండగ రేపట—యివ్వాళ తిన కూడదట. అయితే ముందుగా చేసుకోవడం ఎందుకో నాకు తెలీక అడుగుతున్నాను. మైసూర్ పాక్ చూస్తూవుంటే నాకు నోరూరుతుంది; చేస్తున్న వాళ్ళకి నోరూరదు, మామయ్యా?"

"ఊహూ. పెద్దవాళ్ళకి అంత తిండి చాపల్యం వుండదు."

"అలాగా!" అంది శేషు, ఆ విషయాన్ని తను నమ్మలేనట్టుగా.

హోటల్‌లో ప్రవేశించబోతూ వుండగా మమ్మల్ని ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నట్టుగా హోటల్ యజమాని చిరునవ్వు నవ్వాడు. ఇంతలో త్రేనుస్తూ బయటికి వస్తున్న ఒక యిన్స్పెక్టర్ పెద్దమనిషి గేటు దగ్గిరే నన్ను కబుర్లలోకి దింపాడు. ఆ అయిదు నిముషాల బాతాఖానీలో జాతీయ అంతర్జాతీయ విశేషాలు ఎన్నో దొర్లి పోయాయి. పృథ్వినంతా ఒక్కసారి గాలించేశాం. నేను ఆయన్ని వొదిలించుకుని లోపలికి వెళ్ళే సమయానికి శేషు తన కృషిలో పూర్తిగా నిమగ్నమై

వుంది. ఆమెకి యెదురుగా వున్న కుర్చీలో నేను ఆసీ
నుణ్ణి అవగానే చెప్పింది.

"మామయ్యా, ఒక జిలేబీ తీసుకురమ్మన్నాను.
దాని రుచి నాకేం తెలీదు. ఇంకోటి తీసుకురమ్మ
న్నాను. జిలేబీలు ఏమీ బావుండ లేవు, మామయ్యా!
నాకో బెనారెస్ కాజా తెప్పించు," అంది.

నేను తెప్పించేదేముంది, ఆమె అడగడమే తడ
వుగా సప్లయి చేసేందుకు సిద్ధంగా వున్నాడు, రామ
బంటులాంటి సర్వర్.

నేను వోవల్‌టిన్ తీసుకురమ్మని సర్వర్‌తో
చెప్పగా, తనుకూడా వోవల్‌టిన్ కావాలని
చెప్పింది. ఆయాసపడుతూ కప్పులో సగం మాత్రం
తాగగలిగింది. మిగతా సగమూ వదల్లేక వదల్లేక
వదిలింది.

"మామయ్యా, ఈ వదిలేసిన సగానికికూడా
మనం డబ్బు యివ్వవలసిందేనా!"

"ఇవ్వాలి."

"అయితే, యిదికూడా ఎలాగో అలా తాగ
య్యనా?"

వద్దన్నాను,—వమనం చేసుకుంటుందేమో
అని భయపడుతూ.

బిల్లు చెల్లిస్తూ వుండగా హోటల్ యజమాని శేషుని వుద్దేశించి అన్నాడు.

"అమ్మాయిగారు ఈ మధ్య రావడం లేదు."

మామయ్యే తీసుకొస్తూవుంటే తన కేం ఆటంకం వుందన్నట్టుగా నా మొహం కేసి చూసింది శేషు.

ఇంటికి వస్తున్నాం.

"నీవుట్టినపండక్కి మీ యింట్లో ఏం చేస్తారు, మామయ్యా?"

"ఏమీ చెయ్యరు. అన్నం వండుకు తింటారు."

"మరి, నువ్వు కొత్తబట్టలు కుట్టించుకోటావా?"

"ఊహు."

"మరి, మానాన్న ఎందుకు కుట్టించుకున్నాడూ?"

"మీనాన్న చిన్నపిల్లాడు."

"లేదు, నువ్వే చిన్నవాడివి. నాకు ఆమాత్రం తెలీదనుకున్నావా! నాన్న జుట్టంతా నెరిసి పోయింది. నీ జుట్టు యింకా నెరవందే! నల్లగా, ఎంచక్కగా వుంది."

సంతోషించాను,—శేషుకివున్న ప్రపంచ జ్ఞానానికి.

"మామయ్యా, నాకో సందేహంవుంది—చెప్తావూ?"

"ఊఁ."

"నవ్వకూడదు. ఎవ్వరికీ చెప్పకూడదు."

ఏమిటా అని నా బుద్ధిని అడిగాను. ఎందుకో అంత తొందర! ఒక్క క్షణకాలం వోపిక వహిస్తే శేషే చెప్తుంది కాదూ!

"నేను పెద్దా, నాన్న పెద్దా?"

అతి ప్రయాసతో నవ్వుని దాచుకో గలుగుతున్నానని శేషు గ్రహించింది.

"వెటకారం చెయ్యకు, మామయ్యా. నవ్వకు. నవ్వితే నీతో ఎప్పుడూ మాట్లాడను. నీకూ నాకూ రాంరాం. నా పుట్టినపండగ మే నెలలో వచ్చింది; నాన్న పుట్టిన పండగ జూన్ నెలలో వచ్చింది. అయితే, మరి, నేను ముందు పుట్టానా? నాన్న ముందుపుట్టాడా?"

(డిశంబరు - 40)

# శేషుతో షికారు

తనను సాయంకాలం తప్పకుండా షికారుకి తీసుకు వెళ్ళాలని శేషమాంబ మధ్యాహ్నమే ఘట్టిగా వార్నింగ్ యిచ్చింది. ఎనిమిదేళ్ళుండని శేషుతో షికారు తమాషాగా వుంటుంది.

కుంటి ప్రశ్నలూ గుడ్డిప్రశ్నలూ వెయ్యాని పట్నంలో తీసుకు వెళ్తానని మరతు పెట్టాను. శేషు వొప్పుకుంది.

ఎండ ఏటవాలుగా వున్నప్పుడు యిద్దరమూ షికారుకి బయలు దేరాం. మేము మా నందు మలుపు తిరుగుతుండగా ఒక పంది—అప్పుడే మా పట్నం మురికి కాలవలో శిరస్నానం చేసిన వరహావతారం—మా కెదురయింది.

"మామయ్యా పంది మంచి శకునమేనా?" అంది శేషు.

నాకు మాత్రం ఈ శకునాల గురించి ఏమంత తెలుసు? అంబష్టుడు ఎదురుగా వస్తే వెళ్ళిన పని ఫలవరం కాదనీ, మీదుమిక్కిలి నక్రమంగానూ

క్షేమదాయకంగానూ జరుగుతుందనీ అనుకోవడం రివాజు అని నాకు తెలుసు. బురదలో పొర్లి వచ్చిన వరాహం శుభశకునమా, అశుభశకునమా? శేషు అప్పుడే హద్దుమీరి నడుస్తోంది.

"హద్దుమీరి నడుచువారు శిక్షింపబడుదురు," అన్నాను.

ఆమె నవ్వుతూ, "లేదు. ఒక్కటీ చెప్పు. ఇంకేమీ అడగను.'

చిన్నగా నవ్వుతూ ఆమె కుతూహలానికి జాలి పడ్డాను.

"పిల్లి ఎదురుగా వస్తే పని పాడవుతుందంటారు,—నిజమే కాదూ—మామయ్యా!"

"నిజమే!" అన్నాను, ఏమీ అనకుండా వూరుకునేందుకు వీల్లేక.

"అయితే, పంది?"

శేషు ఈ పందిని వదిలేటట్లు లేదు. ఆజంతువు మాకెదురవడం మంచో చెడ్డో తేలాలి. శేషు ఒక విషయం పట్టుకుందా కామారపుజెడిలా దాన్ని వదలదు. వూరుకోపెట్టేందుకు ఒకటేమార్గం. దగ్గర్లో వున్న పిప్పరమెంటు షాపువైపు నడవాలి. అంతటితో ఈ ధోరణి వదిలేసి ఆ తిండి హడా

విడిలో పడుతుంది. కాని, నేను ఆ విషయాన్ని తప్పించాలని ప్రయత్నిస్తున్నానని గ్రహించిందా పోను చాక్‌లెట్లు కూడా పని చెయ్యవు.

"పంది మంచి శకునమే?" అన్నాను, విష్ణుమూర్తి ఒకానొకప్పుడు ఎత్తిన అవతారం చెడ్డదవుతుందా అనే విశ్వాసంతో.

"భలేగా వుంది," అంది శేషు చిన్నగా గెంతుతూ. "మనకి మాంఛి శకునం అయింది."

ఎందుకో? పెళ్ళికి వెళ్తున్నామా, పేరంటానికి వెళ్తున్నామా మంచికి!

శేషు నా చిటికిన వేలు పట్టుకు అణకువతో నడుస్తోంది. చిన్నపిల్లలతో షికారులో ఒక ప్రత్యేకత వుంది. స్నేహితులతో ఆషామాషీగా మాట్లాడుతూ నడవడం, పరిచయస్తులతో పిచ్చాపాటీగా రాజకీయాలు మాట్లాడుతూ నడవడం, పెద్దమనుషులతో వ్యవహారాలు మాట్లాడుతూ నడవడం, బాకీదార్లతో డబ్బు యిబ్బందుల గురించి మాట్లాడుతూ నడవడం — యివన్నీ ఒక రకం. అవి సర్వసామాన్యంగా అలవాటై ఆనందాన్ని యివ్వలేకపోయే షికార్లు. ప్రపంచమంతా ప్రశ్నార్థకంగా వుండే చిన్నపిల్లతో కబుర్లాడు

తూనో, కలలు కంటూనో గాలిలో తేలిపోతు
న్నట్లు నడవడంలో మనస్సుని వుల్లాసపరిచే
మాధుర్యం వుంది. శేషు నాకు అజేయుడైనా
ప్రతాపం మీద ఘాటైన లెక్చరివ్వదు — టిమొ
షెంకో సైనిక వ్యూహాల గురించి ధాటీగా మాట్లా
డదు — హిందూలా సవరణ గురించి అసలే
పల్కదు.

మెయిన్ రోడ్డు మీదికి వస్తున్నాం. జట్కా
సాయిబు దూరాన్న ఉన్నాడు. మేము కనిపించ
గానే, "బండి కట్టనా, బాబూ!" అన్నాడు.

జట్కా సాయిబంటే శేషుకి అభిమానం. అతని
గెడ్డం ఆమెకి చాలా యిష్టం. 'సాయిబు గెడ్డం
బావుంటుంది, మామయ్యా. బ్లేడ్సుకోసం యింత
యిబ్బంది పడుతున్నావ్ - నువ్వుకూడా గెడ్డం
ఎందుకు పెంచుకోకూడదు ? — నేనాడుకునేం
దుకు భలేగా వుంటుంది," అని శేషు చాలా
తఫాలు సలహా యిచ్చింది.

"బండి మీద షికారు వెళ్దాం," అంది.

"బండి మీద 'షికారుకి వెళ్లరు - నడచి
వెళ్తారు," అన్నాను.

"బండి అయితేనేం?" అంది.

"మళ్లీ హద్దు మీరుతున్నావ్!" అని వారించాను.

ఈలోగా జట్కా-సాయిబు చవకగా వచ్చిన పచ్చగడ్డి బుంగ బేరమాడుతూ మా వునికిని మరి చాడు. అదే మాదిరిగా శేషు పది అడుగులు వెయ్యగానే జట్కా-సాయిబూ, అతని అద్దాల బండీ, ఎగిరే గుర్రమూ మర్చిపోయింది.

పంపులచెరువు దిక్కు-గాబయలుదేరాం. నీడలు పొడుగై, మరీ పొడుగై, చాలా పొడుగై చివరికి అదృశ్యమవుతున్నాయి. ఎర్రబడ్డయినబింబమునిగి పోతోంది. శేషూ నేనూ ఆ గట్టు మీదకూచుని నీళ్ళమీది నాచునీ, పైన ఎగిరే పక్షుల్నీ, పక్కని నడిచే మనుషుల్నీ పరికిస్తున్నాం.

శేషుకి ప్రశ్నలు వేసే అవకాశం లేదు.

వచ్చేస్తున్నాం. వెలుతురు యింకా బాగానే ఉంది. గొడ్లమందలు తప్పించుకుంటూ యింటి వైపుగా వస్తున్నాం.

శేషు టెన్షన్ భరించలేకపోతోంది. ఆమెకి కొద్దికొద్దిగా చికాకు కలుగుతోంది.

"మామయ్యా, షికారు అంటే యింత చప్పగా వుంటుందేం!"

"ఏం ?" అన్నాను, ఏమనాలో తెలీక.

"మాట్లాడకూడదనే షరతు షికారులోని మజా పాడుచేసింది. కోపం వస్తుందేమో అని మాట్లాడలేదు."

"మంచి పని చేశావ్!"

"కబుర్లు లేకుండా షికారు బా వుం డ దు. పెరుగూ పప్పూ లేకుండా అన్నం తింటే తిన్నట్టు వుంటుందా ? ఇలా అయితే నేనింకెప్పుడూ షికారుకి రాను."

"పోనీలే !" అన్నాను, కోపం ఆ చిన్న మొహానికి ఎలాంటి అందం తీసుకు వస్తుందో చూదామని.

ఆకాశంలో ఒక మూల మబ్బులు దట్టంగా కమ్ముకున్నాయి. మారాన్న దుమారం లేచింది. మునిసిపాలిటీ శ్రమని తగ్గిద్దామనే సదుద్దేశంతో రోడ్లని శుభ్రపరచడానికి పూనుకున్నాడు గాలి దేవుడు. శేషు మొట్టమొదట కంగారు పడింది. కన్నీళ్ళ పర్యంతం అయింది. ధయిర్యం చెప్పాను.

తటపట లాడుతున్న చినుకుల్నీ, ఝుంయ్ మంటూన్న గాలినీ, తీక్షణంగా లేస్తున్న దుమారాన్నీ చీల్చుకుంటూ యింటి దిక్కుగా నడిచాం. ఇద్దరమూ తడిసి ముద్ద అయి యిల్లు చేరుకున్నాం.

ఎదురు చూస్తున్న తన తల్లితో, "మామయ్య వన్నీ అబద్ధాలే! వంది శకునం మంచిదన్నాడు. అదే యింత పని చేసింది," అని శేషు అంది, వరికిణా నీళ్ళు పిండుకుంటూ.

(జూలై 1942)

---

# పె న్సి ల్

అమ్మా నాన్నా అలా మాటలు ముడుచుకు కూచోడం వసంత్‌కి నచ్చలేదు. వీళ్ళపోట్లాటలు కాదుగాని తల ప్రాణం తోకకి వస్తోంది. ఇద్దరి మధ్యా నలిగి తను నానాయిదీ అయిపోతున్నాడు.

తన పెన్సిల్ పోయిందనీ కొత్తపెన్సిల్ కావాలనీ అమ్మతో చెప్పాడు. "నాకు తెలీదు— మీనాన్నని అడుగు," అనిబుస్సుమంది. నాన్న దగ్గిరికివెళ్ళి "నాన్నా నాన్నా, నాకుపెన్సిల్ కావాలి" అంటే, "వెధవా., యిన్నాళ్ళనుంచీ పెన్సిళ్లు నేనిస్తున్నానా! నువ్వూకూడా అమ్మవక్షం జేరి నాటకం మాడుతున్నావా"? అని కస్సు మన్నాడు.

వసంత్ తన చిన్నకుర్చీమీద కూచుని, తన చిన్నరాతబల్లమీద రెండు చేతులూఆనించి ఆలోచించడం మొదలెట్టాడు. ఇవ్వాళ ఆదివారం. అప్పుడేపదకొండుదాటింది. సాయింత్రం స్కూల్లో ఆటలకి పోవాలి. మధ్యాహ్నం మొదలియార్ గారింటికివెళ్ళి గులాబ్ జామ్ తినాలి—వాళ్ళ బ్బాయి రమ్మనమని మరీమరీచెప్పాడు. ఆ జామెట్రీ బొమ్మలు రేపుచూపించకపోతే బెంచి ఎక్కిస్తాడు లెక్కలమేస్టరు ! ఇంకా లెక్కలు పూర్తిచేసుకోవాలి; స్నానంచెయ్యాలి; అన్నం తినాలి; బట్టలు వేసుకోవాలి. గడియారం అరగంట కొట్టింది. తన మొహాన ఒక పెన్సిల్ పారేసి, అమ్మానాన్నా యింకో రెండురోజులు పోట్లాడుకున్నా తనకి యిబ్బంది లేదు.

వంటమనిషి దగ్గిరికివెళ్ళాడు వసంత్. "అవ్వా! అవ్వా!! అమ్మా నాన్నా అలావున్నారేం!" అన్నాడు. అవ్వకి కొద్దిగా చెవుడు. గట్టిగా చెప్పమని చెవి చూపింది. వసంత్ "అమ్మానాన్నా అలావున్నారేం!" అని బిగ్గిరిగా అరిచాడు. అదే సమయంలో నాన్నతువాలు భుజంమీద వేసుకుని బాత్ రూంలోకి వస్తున్నాడు. నాన్నని క్రీగంట

చూసి వసంత్ తనగదిలోకి తుర్రుమన్నాడు...
ఛా! తను పెద్దయినాక చెవిటివంటమనిపిసినిమాత్రం
పెట్టుకోడు...నాన్న విన్నాడేమో కూడాను....
వసంత్ తనగదిలో మంచంమీద కూచున్నాడు.
గడియారం గణగణ పన్నెండుకొట్టింది. పాడు
టైము...ఎంతవేగంగా పరిగెడుతోందీ! తనకి
పెన్సిల్ లేదు. ఇల్లంతా మారుమోగేటట్లు ఒక్క-
సారి 'పెన్సిలో!' అని అరవాలనిపించింది. తనకేదో
పిచ్చిపుట్టిందని అమ్మానాన్నా కలిసిచావమోదుతే!
మును పెప్పుడూ అరడజను పెన్సిళ్ళుంచేది
అమ్మ తన పెట్లో! ఇప్పుడు గీసిగీసి అడిగితేగాని
ఒక్కటికూడా ఇవ్వడం లేదు. యుద్ధంఅంటుంది.
పెన్సిళ్ళతో యుద్ధాలు చేస్తారా—వొట్టి అబద్ధం
గాని. అమ్మ ఈ మధ్య అబద్ధాలకోరు అయి
పోతోంది. అమ్మ మంచిదికాదు—నాన్నే మంచి
వాడు...సోన్నమాత్రం? రంగుల స్వెట్టర్ కొని
పెడితేగాని స్కూలుకి వెళ్లనని ఏడ్చినరోజున
వీపు చిట్లగొట్టాడు. ఇద్దరూ యిద్దరే! ఈ అమ్మా
నాన్నా అసలు మంచివాళ్ళు కారు...మరి...
పెన్సిల్...

వసంత్‌కి ఆకలివేళ తప్పిపోయింది. పెన్సిల్

మినహా మరో ఆలోచన లేదు. జుట్టు పీకేసుకుని, వొళ్ళు రక్కేసుకుని, పుస్తకాలు కిటికీలోనుంచి గిరవాటు వేసి, బట్టలు బ్లేడుతో తునకలుగా చేసి, దీపావళినాడు మిగిలిన మతాబులు ఆ మంచం మీద కూచుని కాల్చాలనిపించింది. ఇల్లంటు కుంటుందేమో! మొన్న సినిమాలో చూసినట్లు ఆ కిటికీలోనుంచి దూకేస్తాను. బాబోయ్! బుర్ర గిర్రున తిరిగిపోతోంది.

"వసంతా, యింకా అన్నం తినలేదేమిరా!" అంటూ అమ్మ గదిలోకి వచ్చింది. కంఠం మామూలు స్థాయిలో లేదు. పలుకులో కాఠిన్యత వుంది.

"నాకు పెన్సిల్ కావాలి."

"అన్నం తి న లే దే మ ని అడుగుతున్నా."

సూటిగా సమాధానం చెప్పమని తల్లిఆజ్ఞ.

వసంత్ జవాబు చెప్పలేదు.

"స్నానం చేశావా?"

వసంత్ కళ్ళు వప్పజెప్పి చూస్తున్నాడు.

"గుడ్డి గుర్రాలకి పళ్ళు తోముతున్నావా?" ఉరిమిచూసింది తల్లి.

"పెన్సిల్ ... ..."

ఛెళ్ళున తగిలించింది అమ్మ. వసంత్ బావురు

మన్నాడు. దెబ్బతగిలి కాదు; పొద్దుట్నుంచీ
పెన్సిలో అని అఘోరిస్తూవుంటే తన మొర ఆలకించి
ఒక పెన్సిల్ మొహాన పారెయ్యలేదు సరిగదా—
అమ్మా నాన్నా దెబ్బలాడుకు మధ్యని తన నెందుకు
కొట్టాలి ?—అని వుక్రోషం. ఆ వుక్రోషంతో
కుయ్యోమొర్రో మంటూ బిగ్గిరిగా అరిచాడు.

"— పైకి ఏడవవుకదా!" అంటూ మరో ఛురక
తగిలించింది అమ్మ.

యావచ్ఛక్తితోటీ ఏడుపందుకున్నాడు కథా
నాయకుడు. ఇంట్లో యిక భోంచెయ్యకూడదనీ,
తాత్కాలిక సన్యాసం పుచ్చుకుందామనీ తీర్మా
నించుకుని గడపదాటబోతున్న నాన్న కర్ణరంధ్రాల
లోకి ఈ బాలకుడి దీనాలాపములు ప్రవేశించగా,
అతను తక్షణం రంగస్థలం మీదికి హనుమంతు
డిలా వురికాడు. వసంత్ నాన్నని చూసీ చూడ
గానే అతని రెండు కాళ్ళూ పెనవేసుకుని, యింకా
యింకా ఏడవడం మొదలెట్టాడు.

"వూరుకో, నాయనా, వూరుకో, మనరోజులు
తప్పివచ్చాయి," అంటూ కుమారరత్నాన్ని సము
దాయించడానికి వూనుకున్నాడు నాన్న. అమ్మ
వసంత్ వంక చురచుర చూసింది.

"నన్ను కొట్టలేక వాణ్ణికొట్టావ్!" అన్నాడు నాన్న అమ్మతో.

"అబద్ధపుమాటలాడకండి. ఇప్పుడు దగ్గిర దగ్గిరిగా ఒంటిగంట అవుతోంది. ఇంతదాకా స్నానంలేదు; తిండిలేదు. అలా గోళ్ళుగిల్లుకుంటూ కూచున్నాడు. పిల్లల్నికా స్తగదమాయించి, భయం చెప్పకోకపోతే, వాళ్ళెందుకయినా అక్కర కొస్తారా?"

"వాడివాళ్ళు కందిపోయింది."

"మీకేలెండి మహా పేరు వుంది... చెప్పొచ్చారు......"

"పిల్లల్ని కొట్టకూడదు," అన్నాడునాన్న.

"పిల్లాడి పెంపకం విషయంలో మీరు జోక్యం కలుగజేసుకోకూడదు," అంది అమ్మ.

"వాడికన్నిళ్ళుచూస్తే కడుపుతరుక్కుపోతోంది."

"కన్నతల్లికంటేనా......?"

ఇద్దరి మొహాల వంకా వంతుల ప్రకారం చూస్తున్న వసంత్‌ని వుద్దేశించి "వసంత్ అమ్మ మంచిదా, నేను మంచివాణ ?"అన్నాడు నాన్న.

"నాకు ఎవరు పెన్సిల్ యిస్తే వాళ్ళు" అన్నాడు వసంత్.

అమ్మా నాన్నా బిక్క-మొహాలతో ఒకళ్ళ
నొకళ్ళు చూసుకున్నారు.

"అన్నం చల్లారిపోతోంది," అంది చావిటిఅవ్వ, గుమ్మందగ్గిరికివచ్చి. అమ్మనీ నాన్ననీ చెరోచేత్తోనూ పుచ్చుకుని వంటింట్లోకి నడిచాడు వసంత్.

ఆసాయంత్రం వసంత్ ఆటలనుంచి తిరిగి వచ్చేటప్పటికి సొరుగులో ఆరు పెన్సిళ్ళూ, తలగడకింద ఆరుపెన్సిళ్ళూ వున్నాయి.

(అక్టోబరు 44)

---

# రైలులో

పూనాస్టేషనులో మా వాడు నన్ను రయిల్లో దూర్చాడు. ఈ రయిలువాళ్లు—మీరు ప్రయాణం చెయ్యొద్దో!—అని అఘోరిస్తున్నారు కనక, స్థలం లేదనే కంప్లయింట్ అనుచితం. టికెట్ దొరకడమే మహాద్భాగ్యం.

నేనంటే దూరాను గాని నా పెట్టె, హోల్డాలూ, కారియరూ ఎలాగ? నోట్లో ఈలా, చేతిలో జండాతో గార్డు యములాడిలా, రెడీగా వున్నాడు. మా వాడు

పెట్టెమీద హోల్డాలు పెట్టి, ఆ మొత్తాన్ని కిటికీలో నుంచి తోసేస్తున్నాడు. లోపల కూచున్న ఒక తల పాగామనిషి ఆ వస్తువుల్ని బయటికి నెట్టాలని ప్రయత్నిస్తున్నాడు. తలపాగామనిషి తలతిక్కకి మా వాడు వుద్రేకుడై పోయి, సామానుకి ఒక్కపుష్ యిచ్చాడు. తల్లి వొళ్లో కూచున్న ఒక నాలు గేళ్ల పిల్ల ఈ మోడరన్ ముష్టియుద్ధపరిణామానికి కెవ్వుమని అరిచింది. కోటఛేదించిన వీరత్వంతో సామానూ, రైల్వే అడ్వర్టయిజ్మెంటుప్రకారం నా వెంట సతతమూ వుండే కారియరూ నన్నూ జేరాయి.

"వెళ్లగానే ఉత్తరం రాయేం!" అన్నాడు మా వాడు.

"మన వాళ్లందర్నీ అడిగానని చెప్పేం!" అంటున్నాను నేను.

వల్లూరి జగన్నాథరావుగారి ప్లేటు జ్ఞాపకం వచ్చింది. 'ఈరోజుల్లో పెళ్ళాలు తప్పిపోరు—పారిపోతారు.' అంత పొడుగు బండికీ రాజైన గార్డు విజిల్ వూదాడు. పెట్టెలలో చైతన్యం కలగ నారంభిస్తోంది. రయిల్ నన్నూ మా వాణ్ణీ వేరు చేసి పోంది. పొయిత్రీకి అవకాశంలేని పరివర్తాలు—

అంచేత మా వాణ్ణి గురించిన తలంపు, అతను
నా దృష్టినుంచి జారిపోగానే తొలగిపోయింది.

పదకొండు అయింది. సాయంత్రం అయిదు
గంటల దాకా నేనా రైలుపెట్టెలో మకాం
చెయ్యాలి. అంత సేపూ నుంచుంటానా?- చిన్న
ప్పుడు బళ్ళోకూడా నుంచోలేదే! ఎవర్ని స్థల
మడుగుతాను భాషరాని ప్రదేశాల్లో?

చుట్టూరా చూశాను. దూరాన్నుంచి ఒక
ఖాకీగుడ్డల మనిషి నన్ను రమ్మని సంజ్ఞ చేస్తు
న్నాడు. చచ్చినా రైలుపెట్టెలో సందు యివ్వమని
ఆర్భాటం చేసే జాతికి నా మీద ఏ కారణం వల్ల
కరుణ కలిగిందా అనుకుంటూ వాళ్ళవైపు, ఆంజ
నేయుడి అంగలతో వెళ్ళాను.

వాళ్లు ముగ్గురు. తెలుగువాళ్లు. ముగ్గురూ
తొమ్మండుగురి స్థలం ఆక్రమించుకున్నారు.
న్యాయసూత్రాలు నేను వారికి చెప్పానా- మాకు
తెలీదు మాకంపెనీకి రాసుకో - అంటారు.
న్యాయం మాట దేవుడెరుగును, ముందు నా
సీటూ, వారు నా మీద చూపే ఆప్యాయతా
హుళక్కి అవుతాయి.

కడుపు చేతిలో పుచ్చుకొని బొంబాయి వచ్చిన

ముగ్గురు భారతీయులు వీరు. ఒకడిది నంద్యాల, మరొకడిది విజయనగరం, మూడోవాడి వూరు పేరు మర్చిపోయాను. అంచేత అతన్ని జకరయ్య-అంటాను. పూనాస్టేషనులో తెలుగు మాట్లాడే నన్ను చూడగానే వారికి ప్రాణం లేచివచ్చి నట్లయింది.

తాగు పరుచుకున్న బెడ్డింగు మీద నన్ను ఆశీనుణ్ణి చేశారు. నన్ను మర్యాద చేసేందుకు నానా యిబ్బందీ పడటం మొదలెట్టారు నూగు రూను. వాళ్ళ ఆకారల గురించీ వైఖరీ గురించీ చెప్పదమనవసరం. సత్యమూ కనిపించే కాకినరుకు లో యివి మరో మాదు - దేశీయరక్షణసైన్యం లోని అంగాల బాపతు.

ఒకడు సిగరెట్టుపాకెట్ ఆఫర్ చేశాను. మరొ కదు నా నిమిత్యర్థం జామపళ్ళు కొన్నాడు. మూడోవాడు నా దగ్గిర తెలుగు పుస్తకాలేవైనా వుంటే, చదువుకునేందుకు యివ్వమన్నాడు. 'పుస్త కం - వనితా-విత్తం' ఇలాంటి ఆర్యోక్తులు పత్రి కల్లో బాగా చదివివున్నవాణ్ణి అవడంచేత, ఏం జవాబు చెప్పనా అని ఆలోచిస్తూ వుండగానే, నా ఆలోచన ఒకకొనకి తేలక పూర్వమే ఆ మాట

సుభావుడు "కాలనాటి క్షేత్రములు..." అంటూ అందుకున్నాడు. ఆ బాక్‌గ్రవుండ్ మ్యూజిక్‌కి నా పాసింగ్‌షో పొగలు నాట్యమాడాయి.

"జామపండ్లు నాకు సయించవు," అన్నాను, అనాకొకటి చొప్పున కొని, నాకు అరడజను ప్రజంటు చేసిన నందాల్యలమనిపితో.

"మీరు తినాలి, సార్!" అన్నాడు.

మా దొడ్లో ఒక జామచెట్టువుంది. అది ప్రతి సంవత్సరమూ విరగకాస్తుంది - అంచేత నాకు జామపళ్ళు సయించవు. వాసన కూడా గిట్టదు.

"తర్వాత తింటాను," అంటూ పక్కని పెట్టాను, ఆ ఫలాలు

నేను వాళ్ళ పేర్లు అడగలేదు. ఎంచేతనంటే, పోలీసువాళ్ళకీ మిలిటరీవాళ్ళకీ పేర్లు జీవించివుండవు. వారికుండేవి నెంబర్లే. "తొమ్మిదిపైన అంతా అయోమయమే!" అనే వేదాంతుల మాటల్లో నాకు విశ్వాసం పోలేదు.

"మీరు ప్లీడరీపరీక్ష యిచ్చివచ్చారా?" అన్నాడు, విజయనగరం.

ఇంకా నాకా దౌర్భాగ్యం పట్టలేదని మనసులో అనుకుంటూ, పూనా ప్లీడర్లని తయారుచేసే

ఫాక్టరీగా భ్రమిస్తున్న అతగాడితో "లేదు,"
అన్నాను క్లుప్తంగా.

"అయితే స్వరాజ్యాగా రెక్కడున్నారు?"
అన్నాడు.

"నాకు తెలీదు," అన్నాను.

"స్వరాజ్యా గొప్ప గాంధీ గొప్ప?—చెప్పండి?" అన్నాడు మూడో ప్రశ్నలో.

బహుశా, పూర్వకాలంలో రాజకుమార్తెలు రాజకుమారుల్ని యిలాంటి ప్రశ్నలే వేసి, సమాధానాలు చెప్పలేకపోయారని తలలు ఖండించే వారు కాబోలు! నేనేం చెప్పగలను—స్వరాజ్యా గొప్పా, గాంధీ గొప్ప? ఏ అమెరికాలో సెలవియ్యాలి యిలాంటి విషయాలు.

ఇంతలో ధోండ్ స్టేషన్ వచ్చింది. పెట్టె బాగా పల్చబడింది. నంద్యాలమనిషీ జకరయ్యా రైల్లో సాపాటుచేశారు. నన్నుకూడా చెయ్యమన్నారు. చేసేబయులేరానని చెప్పుకున్నాను. విజయనగరం పూరీలతో పొట్టనింపుకున్నాడు—స్వరాజ్యా గొప్ప గాంధీ గొప్ప తేల్చిచెప్పలేని నా 'యింటెలిజెన్స్'మీాద అతనికి కసింత గౌరవం తగ్గింది.

ధోండ్ దాటినతర్వాత రైలు, మసుగాలిని ఆవలిస్తూ ఆఫీసుకి పోయే గుమాస్తాలా నడవడం మొదలెట్టింది. జామపళ్లు తినమని నంద్యాల మనిషి ప్రతి పావుగంటకి రిమైండ్ చేస్తూనే వున్నాడు. ఎదర బల్లమీద కాస్త అయిమూలగా కూచున్న ఒక సాయిబులమ్మాయి, పన్నెండేళ్లది, ముగ్గురు యోధుల మధ్యావున్న నన్ను పావుగంట నుంచి పరకాయించిచూస్తోంది. ఆ అమ్మాయికి ఎదురుగా అంటే నా బల్లమీదనే నాకు కాస్త ఎడంగా కూచున్న—ఒకమరాటీమనిషి మేం మాట్లాడే భాషని నోరు తెరిచి వింటున్నాడు. ఏమిటేమిటో అడిగారు వాళ్లు నన్ను. డిక్షనరీలూ, రిఫరెన్సు బుక్కులూ, లాబరేటరీలూ అవసరంలేని ప్రశ్నలకి సమాధానాలు చెప్పాను.

జకరయ్య, "మీదేవూరు?" అని అడిగాడు.

"బెజవాడ ప్రాంతాల."

భాషని పోగొట్టుకోవడం యిష్టంలేని విజయనగరం, "విజయనగరం ఎలావెళ్లాలి?" అన్నాడు.

"రాత్రి ఒంటిగంటకి ఈ బండి వాడీ వెళ్తుంది. అక్కడ దిగాలి. అక్కడ నైజాంబండి ఎక్కితే, అది తిన్నగా మర్నాడు సాయంత్రానికి బెజవాడ

తీసుకువెళ్తుంది. ఆ రాత్రి బెజవాడలో మకాం
చేసి మూడో రోజు వుదయం కలకత్తామెయిల్
ఎక్కితే, అది విజయనగరం సాయంత్రం నాలుగు
గంటలకి వెళ్తుంది," అని రైళ్లూ, టైములూ,
భోజనవసతులూ తత్సంబంధమయిన వన్నింటినీ
గురించి విపులంగా ఒక పావుగంట ఉపన్యాసం
యిచ్చినతర్వాత ... ...

"మద్రాస్ మీదుగా వెళ్లాలన్నాడే మా
హావల్దారు," అన్నాడు నా రైలు శిష్యుడు.

"ఇంకో రోజు ఆలస్యమవుతుంది. చుట్టు
ప్రయాణం."

"మా హావల్దార్ గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్
ఎక్కి వెళ్లాలన్నాడు. అది వాడీలో వుంటుందా?"

ఏమనను? ఇంకాసేపు వుంటే ఇతగాడు నాకు
ఎక్కాలు వచ్చునా రావా అని సంశయించేటట్లు
వున్నాడు నంద్యాలమనిషి. నన్నీ చెర నుంచి
తప్పించి, తరవాత జగినస్టేషన్‌లో టీ గీ తెప్పించి,
ముగ్గురి తరఫునా నన్ను సన్మానం చెయ్యడం
మొదలెట్టాడు,—కవినీ నావలిస్ట్‌నీ అని తెలీక
పోయినా.

నంద్యాలమనిషి జామపళ్ల సంగతి యింకోసారి

జ్ఞాపకం చేసి, తనో సిగరెట్టు ముట్టించి నాకొకటి యిచ్చాడు. గరమ్ గరమ్ ఛా తాగిన హుషారులో అన్నాడు జకరయ్యతో: "నేను నంద్యాల్లో దిగ్గానే భోగందానింటికి వెళ్ళే మాట నిజం."

జకరయ్య కళ్లు తేలేసి చొంగ కారుస్తూ, "అలాగా!" అన్నాడు. పాపం! అతనికి పెళ్లాం లేదు కాబోలు. ముగ్గురిలోకి కుర్రాడతను. కరువురోజుల విషయం అతని స్ఫురణకి రాగా, బ్రాహ్మడి జందెంలాంటి పేబుక్ తెరిచి, తనెంత నిలవ వుంచుకుంటున్నదీ, తల్లికి ఎంత పంపిస్తున్నదీ నాకు చూపించాడు. తల్లి యింకో ఏడాది పోయిన తర్వాతో, పటాలం నుంచి వెనక్కి వచ్చిన తర్వాతో పెళ్ళి చేస్తానందట. నెలకి నలభై మూడున్నర సంపాయించే తమ ప్రయోజకత్వానికి మురిసిపోయే అమాయకపు జకరయ్యలు నా కళ్లముందు తాండవించారు. ఎన్ని ఆశలో, ఎన్ని కోర్కెలో ఆ వైరిహృదయాలలో!

విజయనగరం మాత్రం గ్రాండ్ ట్రంక్ ఎక్స్ప్రెస్ వాడీ ఎందుకు రాదా అని ఆలోచిస్తున్నాడు.

నంద్యాలమనిషి అమాంతం జేబులోనుంచి ఒక పాకెట్ తీసి, దానిమీదరాసివున్న ఇంగ్లీషుకి

తెలుగు చెప్పమన్నాడు. అది మిలిటరీవాళ్ళకి నప్లయి అయే సుఖరోగాలమందు. ఫలానా అన్నాను. అతను అంతటితో తృప్తిపడలేదు. ఉపయోగించే విధానమూ పూర్తి వివరాలూ నాదగ్గిర్నుంచి వినాలసివుంది. పాపం! అలావినడం అతనికి కొంత మానసిక సౌఖ్యాన్ని యిస్తుంది.

సంద్యాలమనిషి తన పూర్వజీవితమంతా నాముందు - నాకు చెప్పాలనే అభిలాష ఎందుకో?- 'కన్ఫెస్' చేశాడు. ఆత్మకథలు పెద్దపెద్ద పుస్తకాలగా రాసేవాళ్లు ఈ పాటి నిజాలు చెప్పావుంటే చాలుననిపించింది.

నాలుగున్నర దాటింది. కురుద్వాడీ వచ్చింది. నేనక్కడ దిగి పోశాను. కూలివాడు నా సామాను దించాడు. విజయనగరం హడావిడిగా బెడ్డింగ్ చుట్టేసి, టోపీసర్దుకొని, పెట్టె చేతిలో పుచ్చుకున్నాడు.

"ఇదేమిటి?" అన్నాను, అతనితో.

"మీరూ బెజవాడేగా!—వాడీలో దిగాలన్నారుగా!"

"నేను బెజవాడ వెళ్తున్నానని అనలేదు. మా స్వగ్రామం బెజవాడ ప్రాంతాల—అన్నాను. ఇది

కరుద్వాడీ—వాడీకాదు. వాడీ రాత్రి ఒంటిగంటకి వస్తుంది," అన్నాను.

నంద్యాలమనిషికీ జక్కరయ్యకీ విజయనగరాన్ని వేళాకోళం చెయ్యడానికి వీలు చిక్కింది. అతగాడి రెండు జబ్బలూ చెరొకరూ పట్టుకున్నారు. ప్లాట్ ఫారం మీదికి వచ్చి నాకు నమస్కారం చేశారు, గుర్రాలులేని ముగ్గురు రౌతులూ. అవ్యక్తంలో నుంచీ, అవివేకంలో నుంచీ తొంగిచూస్తున్న వారి తెనుగుతనానికి నా గుండె సానుభూతితో కొట్టుకుంది.

నంద్యాలమనిషి అమాంత్రం పెట్టెలోకి ఎక్కి, నేను మర్చిపోవాలని మర్చిపోయిన జామపళ్లు అరూ, రెండు చేతుల్లోనూ ఇముడ్చుకు వచ్చాడు. అన్నీ వద్దన్నాను. రెండైనా తీసుకోవాలన్నాడు. ఒక్కటి చాలన్నాను. అందుకే తృప్తిపడ్డాడా అల్పసంతోషి.

ఒకచేత్తో కారియరూ ఇంకోచేత్తో మిలటరీ జామపండూ పుచ్చుకు, యాస్పిరిన్ అడ్వర్టయిజ్ మెంట్ తాలూకు 'ముగురు రౌతులు' ఫిలిం చూసి చాలా రోజులయిందనుకుంటూ, బార్సీబండి వైపుగా దారితీశాను. (నవంబరు 48)

# దొర

ఉదయం అయిదుగంటలు. బెజవాడ ప్లాట్‌ఫారం కాకినసుకుతోనూ కొత్త కంపులతోనూ కిటకిట లాడుతోంది. అప్పుడే ఆమెని రైలులో ఎక్కించాను. రైలు ఆవిణ్ణి తీసుకుపోతోందే అను దిగులుతో, కడ్డీలు పట్టుకు దీనంగా నుంచున్నాను. తొలికిరణాలు ఈ ప్రపంచపు మురికిని తాకని వేకువజాములో, సుమతి కళ్ళలో కొత్తలోకాల ఛాయలని వెతుకుతూ... ...

మబ్బులు గబగబా కమ్ముకున్నాయి. వర్షపు గాలి రివ్వున వీచింది. సన్నతుంపర.

"బెజవాడ స్టేషనులో రయిళ్ళు ఈ చివరా ఆచివరా ఆగుతాయిగాని, వర్షం పడకుండా వుండే చోట ఆగవేం!" అని అడిగింది సుమతి.

ఎవరికి తెలుసు? ప్రశ్నలకి ప్రతిప్రశ్నలే గాని సమాధానాలు లేవుగా—యుద్ధం కనక! పక్కనే ఒక రిక్రూటింగ్ ఆఫీసరు తన కాలిమనుషులికి స్టేషన్‌మాస్టరు పెట్టె రిజర్వుచేయించలేదని పై

అధికారితో అ ర వం లో మాట్లాడుతున్నాడు యింగ్లీష్! ఆ ఆఫీసర్ హిందూస్తానీలో జవాబు చెప్తూ కొత్తచుట్ట ముట్టించాడు.

చిటపట చినుకులకి తల తడవగా రేకుల కిందికి వెళ్ళాను. సుమతివున్న పెట్టె దురాన్నుంచిచూస్తూ స్తంభానికానుకు నుంచున్నాను. పక్కగా రెస్టా రెంటుకారు.

కారులో 'బాయిస్' యింకా కళ్ళు నులుపు కుంటున్నారు. టీకాగు పొయ్యిమీద కెక్క లేదు. దొరగారొకరు పైపు వెలిగించి, పొగ గుప్పుగుప్పున వదులుతున్నాడు. దిట్టంగా లావుగా వున్నాడు. పొడవుచెప్పడం కష్టం—ఎందుకంటే కూచునే వున్నాడు కనక. ఆ పెద్దకారులో ఒక్కడూ బిక్కు బిక్కు మంటూ కూచున్నాడు.

ఎవరీ దొర? విశాలమైన మొహంలోని ఆ చిన్నకళ్ళు ధ్యానించేతీరు పరిశీలిస్తే అతనేదో భావనాసముద్రంలో మునిగివున్నా డనిపిస్తుంది. తోటిదొరల బెడ్‌టీవేళ కాకపూర్వమే ఈయనెం దుకు యిలా లేచాడు? ఇలా ఒక్కడూ ఏకాం తంగా కూచుని ఏమిటి ఆలోచిస్తున్నాడు?

అతనిది ఏషైరు? స్కాట్లండులో వాడా?

పెళ్లాం బిడ్డలు జ్ఞాపకం వస్తున్నారు గాబోలు! పాపం—యితని ఆప్తులు ఎందరు 'బ్రిటన్ యుద్ధం' లో నమసిపోయారో! మిగిలినవారు రెక్కల బాంబుల వుధృతాన్ని తప్పించుకోగలిగారూ? ఇతనియిల్లు యింకా కూలిపోకుండా వుందా? బిడ్డలు ఏవ దేశాల పాలయారో! తలకోదాని.

ఏ అజ్ఞాతబాధలు నక్షత్రాలతో సంక్రమించిన అధికారంతో తృప్తిపడక అతన్ని అశాంతి పాలు జేస్తున్నాయో! ఒక్కసారి అతనిదగ్గరసా వెళ్ళి "ఏమిటండీ—అంత దీర్ఘంగా తపనపడుతున్నారు?" అని అడగాలనిపించింది. అడగాలనే వైరివుబలాటమేగాని—అడిగి తెలుసుకోగలమా ఇతరులబాధలు? అదీకాక, నల్లవాడికీ తెల్లవాడికీ మధ్య మాటలు నడిచేందుకు భాషేదీ!

బాధలో బాంధవుడయిన ఆ దొరని చూస్తూ అలానే నుంచున్నాను. ఎన్ని వేలమైళ్ళు వచ్చాడూ 'తెల్లవాడిబరువు' మోసేందుకు యితగాడు! నడుం విరిగే బరువుతో కుంగిపోతున్న పాశ్చాత్యుల్లో యితనొకడా! బ్రిటన్‌కి హృదయంలేదూ? అదే వెతుకుతున్నాడు గాంధీజీ. బ్రిటనంటే షా, వెల్స్, హాక్స్‌లే, హాల్డేనూమాత్రం కాదు.

దొరా, నిన్నుచూస్తే జాలేస్తోంది. ఛాతీవిరుచుకు ఎక్కడికా పరుగులు? ఏ ప్రపంచవ్యవస్థ నిర్మించబోతున్నావు, నాయనా! నాజీముట్టడినీ ఫాసిస్టు విజృంభణాన్నీ జయప్రదంగా ఎదుర్కొన్న నీ ప్రజల అకుంఠిత ధయిర్య విశ్వాసాలకి ప్రపంచమే జోహారులర్పిస్తోంది కాని, 'వార్సయిల్స్' గాదు ముందుజరగవలసినపని!—కీర్తిశేషుడైన విల్కీ కలలుకన్న ఏకైక ప్రపంచనిర్మాణం. ఏదో గొణుక్కుంటున్నానులే! నువ్వూ నాలాగే అసహాయుడివి. నాకా విషయం లీలగా తెలుసు. ఈ ప్రపంచ శక్తుల పోరాటంలో, ఈ జీవుల పరిణామావస్థలో, ఈ యుగసంధి సమయంలో - నువ్వెంత? - నేనెంత?—ఫర్మోజామీద వెయ్యి బాంబర్లదాడెంత?—

నలుగురు పిల్లలు—ఎంగిలాకులతో పొట్టపోసుకునే దారిద్ర్యాలు—దొరపెట్టె దగ్గిరగాజేరి "సార్, సార్" అంటూ చుట్టేశారు. సగం తిన్న రొట్టెముక్కో, కాలుస్తూవున్న సిగరెట్టుపీకో, కాలీడబ్బో దొరక్కపోతుందా అని వాళ్ల దేవులంపు. కోతులముందు తినేవస్తువులు పడేసి, అవి తినడాన్ని ఆనందించే పిల్లల్లా దొరలకి ఈ 'సార్'

మూకలమీదికి వండో ఫలమో విసిరి, వాళ్ళు దానికోసం ఎలా కొట్లాడుకుంటారో చూడటం సరదా. ఈ దొరమాత్రం అలాటివాడుకాడు. వాళ్ళు తనను చీకాకు పరుస్తున్నా, గమనించ నట్లుగా ఆలోచనలో మునిగివున్నాడు.

వాన వెలిసింది. రైలు కూసింది. "సార్, సార్" అని ఏనాదిమూక బిగ్గరిగా మొరగడం మొదలెట్టింది. దొర కనుబొమలు ముడిపెట్టాడు. ఇండియా అనగానే యిలాటి దృశ్యాలు అతనికి స్ఫురిస్తాయి కాబోలు!

బీవర్లీ నికోల్స్‌లా మరో 'తీర్పు' రాసి పారెయ్యడుగదా అను సంశయంతో సుమతి పెట్టె వైపుగా నడుస్తున్నాను. రైలు నాకంటె ముందు సాగింది. చిరువెలుతురులో సుమతి రుమాలా, తొంగిచూసే దొరవైపూ కనిపించాయి.

(అక్టోబరు 44)

---

